**ఆచార్య కసిరెడ్డి గారి పదవీ విరమణ సందర్భంగా**
**ప్రచురించిన గ్రంథాలు - 2006 ఆగష్టు**

1. తెలుగు పొడుపు కథలు (సిద్ధాంత గ్రంథం) ద్వితీయ ముద్రణ
2. దివ్యోపదేశం (అనువాద గ్రంథం - స్వామి శివానంద సూక్తం)
3. వచన భగవద్గీత (వ్యావహారిక వచనం)
4. శ్రీ విష్ణు సహస్రనామ స్తోత్రం (ఆనంద లఘుటీక - ద్వితీయముద్రణ)
5. భగవద్గీతం (ఖండగతిలో 701 గేయాలు)
6. ప్రేరణ సాహితి (శివానంద భారతి - 2003-05 సంపాదకీయాలు)
7. జనం పాటలు (జానపదాల్లో..)
8. వేమన వేదాంతం (నూరు పద్యాలకు వ్యాఖ్యానం)
9. అరవై మంచి కథలు (పత్రికల్లో వచ్చిన చిన్న కథలు)
10. అరవై మంచి శ్లోకాలు (పత్రికల్లో వచ్చిన వ్యాఖ్యానాలతో)
11. వందేమాతరం ప్రబోధం (సామాజిక వ్యాస సంపుటి)
12. ధర్మసారథి (ధర్మసారథి పత్రిక 1994-95 సంపాదకీయాలు)
13. ఆధ్యాత్మిక జీవన పద్ధతి (గీతాజ్ఞానయోగ సమాచార్ 2002-2003 సంపాదకీయాలు)
14. మన ఆలయాలు మానవతా వికాస కేంద్రాలు (విశ్వహిందు 2004-05 సంపాదకీయాలు)
15. ఆనందామృతం (గేయ కవితా సంపుటి)
16. ఏకతా సూక్తం (పద్య కవితా సంపుటి)
17. తృష్ణోపనిషత్తు (వచన కవితా సంపుటి)
18. పత్రికల్లో భాష (పరివర్ధిత ముద్రణం)
19. విద్యార్థి భువన విజయం (సాహితీ రూపకం)
20. కసిరెడ్డి కథ (1946-1985 వరకు)
21. దివ్యభారతి (ఆచార్య కసిరెడ్డి సాహిత్యంపై ప్రత్యేక సంచిక)
22. శివమెత్తిన చికాగో (2004లో అమెరికా యాత్ర)
23. సంస్కృతీ సామరస్యం (వ్యాస సంపుటి)
24. జానపద సాహిత్యం (వ్యాస సంపుటి)

# ఆనందామృతం

## గేయ కవితా సంపుటి



ఆచార్య కసిరెడ్డి

www.eTelangana.org

# ఆనందామృతం

## గేయ కవితా సంపుటి

ఆచార్య కసిరెడ్డి




రి.నెం. 250/75

ప్రచురణ :

**జాతీయ సాహిత్య పరిషత్**

భాగ్యనగర్ శాఖ - ఆంధ్రప్రదేశ్

www.eTelangana.org

**ఆనందామృతం**
గేయ కవితా సంపుటి

-ఆచార్య కసిరెడ్డి

ప్రథమ ముద్రణ : 2006, సెప్టెంబర్

ప్రతులు : 1000

ప్రచురణ సంఖ్య : 104

జాతీయ సాహిత్య పరిషత్

భాగ్యనగర్ శాఖ

ప్రతులకు :
12-5-91/101, సాయినివాస్
అపార్ట్స్, విజయపురి, తార్నాక,
సికింద్రాబాదు - 500 017.
ఫోన్ : 040-27017207,
9866956250

డి.టి.పి.
మిల్లీస్ కాపీకార్నర్, తార్నాక.

ముద్రణ :
కర్షక్ ఆర్ట్ ప్రింటర్స్
విద్యానగర్, హైద్రాబాద్.

మూల్యం : రూ. 40/-లు

## పదవీ విరమణ పురస్కారం

**ఆచార్య కసిరెడ్డి గారి**
పదవీ విరమణ సందర్భంగా
(2006 - ఆగష్టు)
ప్రచురించిన గేయకవితా సంపుటి
సహకరించిన మిత్రులకు ఈ
గ్రంథం అంకితంగా గ్రహించిన
వదాన్యులు హిందూ ధర్మరక్షణ
దీక్షాదక్షులు మాన్యులు
**శ్రీ జి. పుల్లారెడ్డి గారికి**
మా ధన్యవాదాలు

ఆచార్య వేణు, పి. భాస్కరయోగి,
కె. మోహన్,
ఉస్మానియా విశ్వవిద్యాలయ
పూర్వవిద్యార్థుల సంచాలన సమితి

భాగ్యనగర్
తేది. 20-09-2006



## అంకితం

### సహస్ర పూర్ణచంద్ర దర్శనోత్సవ సందర్భంగా



**శ్రీ జి. పుల్లారెడ్డి శ్రీమతి నారాయణమ్మ దంపతులు**

సూర్యునిలోని కాంతిలా
భూమిలోని సుగంధంలా
ఆకాశంలోని శబ్దంలా
వాయువులోని చైతన్యంలా
నీటిలోని శక్తిలా
ఆదివ్యాత్మలా
హిందూధర్మం సత్యమై నిత్యమై వెలగాలని
ప్రతి హిందువు ఈ ధర్మరక్షణకు కంకణం కట్టాలని
శ్రమించి జీవించాలనీ
క్రియాశీల కార్య, కర్తకావాలనీ
నిరంతరం తపించే
నిజాలనే వినిపించే
మాతృ పితృసమానులైన శ్రీ జి. పుల్లారెడ్డి దంపతులకు
వారి సహస్ర పూర్ణచంద్ర దర్శనోత్సవ సందర్భంగా
ఈ ఆనందామృతం అంకితం

- ఆచార్య కసిరెడ్డి



www.eTelangana.org

# అమృత కిరణాలు





# ఈ గేయాల నేపథ్యం

ఉపకార వేతనాలకు పరిశోధకులను ఎంపిక చేసేందుకు కొన్నేళ్ల క్రితం ఢిల్లీ వెళ్లాను. జమ్మూ కాశ్మీర్ నుండి నిర్వాసితులై - ఢిల్లీలోని ఒక పత్రికలో పని చేస్తున్న కొడుకు దగ్గర ఉంటూ, ఓ కాశ్మీరు పత్రిక నిర్వహణలో ఉన్న ఓ ఫిజిక్సు ప్రొఫెసర్ పరిచయమయింది. ఆయనో కవితచదివారు. దానికి తెలుగు సేత ఇది.

**నేను మీయమ్మను**

**1947లో నారెండు భుజాలు నరికి వేశారు**

**ఇప్పుడు నానెత్తిన కొడుతున్నారు**

**ఓ కొడుకుల్లారా !**

**మీరింకా కుంభకర్ణనిద్రలో ఉన్నారు.**

ఇది భరతమాత వేదన; కదిలించే వేదన, ఆ తల్లి కొడుకులందరూ ఆలోచించాల్సిన వేదన.

తన ఉద్యోగం, తన ఇల్లూ, విలువైన వస్తువులు అన్నీ వదలిపెట్టి భార్యను మాత్రమే కాపాడుకోగలిగిన స్థితిని వారు వర్ణించారు. ఇలా మూడున్నర లక్షలమంది తాము పుట్టిన నేలను వదలిపెట్టారు. ఇలా అక్కడి హిందువులను ఖాళీచేయించి జమ్మూ కాశ్మీరును ఆక్రమించుకోవాలనే యత్నాలు జిహాదీలు చేస్తున్నారు. ఇలా మెలమెల్లగా భారతదేశాన్ని కబళించాలని దేశమంతటా ఉన్న ముస్లింలను సంసిద్ధంచేస్తున్న మత సామ్రాజ్యవాదం సంగతి అందరికీ తెలుసు.

విదేశీ క్రైస్తవుల ప్రేరణతో ఇక్కడి మిషనరీలు సేవలముసుగులో మతాంతరీకరణలు చేస్తున్నాయి. వారి ఉద్దేశం కూడా ఈ దేశాన్ని క్రైస్తవ స్థానంగా మార్చడమే.



www.eTelangana.org

నిజానికి ఇక్కడ పుట్టి పెరిగిన ముస్లింలు క్రైస్తవులు ఒకకాలంలో హిందువులే - భారతీయులే. హిందూదేశం భారతదేశం ఏపేరైనా ఒక్కటే. కానీ వారు విదేశీయుల ఉచ్చుల్లో పడి తమ పూర్వీకులైన హిందువులనూ, వారి సంతానాన్ని తమ మతాల్లో కలుపుకోడానికి, లేదా భయభ్రాంతులను చేయడానికి, ఎదురుతిరిగిన వారిని చంపడానికి వ్యూహబద్ధంగా ప్రణాళికలు రచిస్తున్నారు. వారి సంఖ్య పెరిగిన తర్వాత హిందువులందరూ వాళ్ల ఇండ్లు ఊకే, మరుగుదొడ్లు ఎత్తిపోసే, లేదా బానిసలుగా మారిపోయి రకరకాల సేవలు చేసే పరిస్థితి ఏర్పడుతుంది.

వారి ఈ ఆలోచనలకు తోడుగా కుహనా సెక్యులరిస్టులు, ఓట్లమూతినాకుడు నాయకులు వ్యవహరిస్తున్నారు. హిందూ దేశాన్ని హిందూ జాతిని ఈ విధంగా మాయం చేసే కుటిలయత్నాల్ని విషవ్యూహాల్ని ఎదుర్కొని ప్రపంచంలో ఉండాలంటే హిందువులు (భారతీయులు) విక్రమించక తప్పదు.

ఈ నేపథ్యంలో ఈ గేయకవితలు వచ్చాయి. భావనిష్ఠాత్మక ప్రతి ఘటనాత్మక హిందువు నిర్మాణం కావాల్సిన అవసరం ఉందనిపించింది. ఆయా కవిసమ్మేళనాల్లో చదివిన కవితలే ఇవి.

భావనిష్ఠలేని వారు స్థిత ప్రజ్ఞులు కాలేరు. ప్రతి ఘటన శక్తి లేని వారు తమ అస్తిత్వాన్ని కోల్పోతారు. పాశ్చాత్య విషసంస్కృతిలో, భోగలాలసతలో, కులవర్గ వాదాలలో, పార్టీల అధికార దాహార్తిలో కొట్టుకు పోతున్న హిందూజనతకు (యువతకు) సరియైన దిశను చూపించ వలసి ఉంది. వ్యక్తిత్వంతో, స్వాభిమానంతో తనకాళ్లమీద నిలిచి ఆసురీశక్తుల విజృంభణను ఆపి స్వరాజ్యాన్ని సురాజ్యంగా మార్చుకొనే ఆత్మవిశ్వాసపరులను, ఆత్మార్పణశక్తులను, ఆత్మత్యాగులను నిర్మించాల్సి ఉంది. ఈ నేపథ్యంతో అధ్యయనం చేసినప్పుడు ఈ గేయకవితల్లో జాతీయ ఆధ్యాత్మిక సాంస్కృతిక తత్త్వమే కనిపిస్తుంది. మరి ఈ దృష్టితో అధ్యయనం చేయండి.

**ఆచార్య కసిరెడ్డి**
కార్యదర్శి
జాతీయ సాహిత్య పరిషత్, ఆం.ప్ర.

భాగ్యనగర్
తేదీ. 29-09-2006



# అణుభారతీయం

బుద్ధుడు పుట్టిన పూర్ణిమనాడే
పోఖ్రానులో అణుస్ఫోటనం
పంచశీలలను పంచిన దేశం
సంచితాణువు ప్రేల్చుటెందులకు ?

పంచశీలపై శాంతి సంతకం
ముంచిన చైనా ఎర్రటి జెండా
నెత్తురు చొంగను కార్చిందెందుకు ?
పొత్తును ధ్వంసం చేసిందెందుకు ?

చైనా పాముల ఆలింగనమున
హాయిని మేసే దేశద్రోహులు
అరుణాచల్‌లో హెలీపాడు కథ
ఎత్తి చూపరే పొత్తుకు భంగమొ ?

దేశంలో చొరబాటుదారులు
ఢీకొన విషనాగాలై వస్తే
ఐదుకోట్లు ఓటర్లలిస్టులో
హాయిగ చేరీ మీకోటేస్తే
వాళ్ళకోట్లకూ గులాములవుతూ



www.eTelangana.org

జోళ్లను నాకే శ్వానాల్లారా !
మాకు భద్రతకను కలిగిస్తారా !
మాతా ధాత్రిని రక్షిస్తారా !
ఢిల్లీ ముంబయి కోయంబత్తూర్
దేశమంతటా ఆర్డియెక్కును
ఆకు పచ్చగా మండిస్తుంటే
ఢీకొను శక్తిని పెంచకపోగా
తుపాకి గొట్టంగాళ్లు తొత్తులయి
భాయీ భాయని పూజిస్తుంటే
నీనా అస్మితకే మూలమ్మగు
జన్మభూమి సంరక్షణ ఎవరిది ?

సుందరనందనవన కాశ్మీరం
అందం మాడి మసవుతు ఉంటే
ఉగ్రవాద సిద్ధాంతం ఆకలి
ఉర్విసోదరుల నమిలేయొచ్చా!
లేత బుగ్గలను కాల్చిన కమురది
సోకని నాసిక లెవరివి ఎవరివి !
సతతాశ్రువులే గంగాజలములు
ఎన్నాళ్లింకా భారతిముఖమున ?



వేప, బసంతీ బియ్యం, తులసి
ఆయుర్వేదం పాకం పసుపును
పాశ్చాత్యాగ్రం పేటెంటంటూ
అహంకృత చట్టం అడ్డంవస్తే
విశ్వజనమ్ములు శ్రోత్రియులవగా
స్వదేశి శంఖం పూరించొద్దా!
అగ్రముఖాలకు బుద్ధి చెప్పగా
స్వశాస్త్ర జ్ఞానం వినిపించొద్దా!

తనభూగృహమున కోట్లబాంబులు
ఘనముగ అమెరికకుండొచ్చంటా !
చైనా బాంబులు ప్రేల్చొచ్చంటా !
ఫ్రాన్సు ప్రయోగం చేయొచ్చంటా !
వంద కోట్ల జనసంఖ్యను కలిగిన
భారత్ శాస్త్రం పెరగొద్దంటా !
ఎన్నాళ్లింకా చితుకుల బతుకులు ?
శిరస్సెత్తుకొని నిలిచేదెప్పుడు ?
చిమ్మిన నెత్తురు కాశ్మీరులో
శివారావములు చేస్తూ ఉంటే
అమెరిక పోలిస్ బెత్తం చూపుతు
సిటి బీటిపై సంతకమంటది !
సాఫ్టువేరులో వీరులంటది


www.eTelangana.org

శాంక్షను లంటూ ఎర్రగ జూస్తది.
పెట్టుబడుల సామ్రాజ్య వాదమును
కట్టిపెట్టగా లేవాలిప్పుడు.
కోణకోణమున క్రీస్తుమతమ్మును
జాణతనమ్మున పెంచగ వచ్చును
భూమ్యాకాశోదక మార్గమ్ముల
ఇస్లామీయులు దూరగవచ్చును

కాషాయధ్వజకాంతి ప్రసరణం
కోశ కోశమున నిండకూడదట !
అల్ప సంఖ్యాకాషాయమ్మయ్యిన
ఆ భూములు ఏమాయెనో తెలియద ?
అన్నము లేనిది అణుబాంబెందుకు
అన్నవారు మన అన్నలు తమ్ములె !
భూములు బుగ్గయ్యిపోతూ ఉంటే
జన్మభూములనె దురాక్రమిస్తే
గృహమది ఎక్కడ ! పంటలు ఎక్కడ
ఫ్యాక్టరీ ఎక్కడ ! గుడిబడి ఎక్కడ
మతసామ్రాజ్యం పాద ఘట్టనల
నలుగుదమా ! పోరాడుదమా !



బియ్యం పొగాకు రష్యాకెగుమతి
బసంతిబియ్యం అరబ్బులకెగుమతి
గొడ్డుమాంసపూ డబ్బాలెగుమతి
ఉల్లీ ఇమ్లీ రోజూ ఎగుమతి
పెట్రోలొక్కటి సరిపోనుంటే
డాలర్ దేశాల్ శాసించేవా !
భారతీయతా శక్తిని ఏకత
పథమందిప్పుడు నడిపించాలోయ్ !

స్వర్ణ భారతం అప్పులపాలై
చిప్పచేతిలో దేబిరించుటా!
నీలో స్వార్థం నాలో స్వార్థం
స్వాములందరూ స్కాముల పాములు
గడ్డిని ఎరువును బల్బులు తింటరు
పెండను కూడా దిగుమతి చేస్తరు
స్విస్సు బ్యాంకుల దిక్కే చూస్తరు
నీతిని శక్తిని పెంచే దెవ్వరు !
బారెడు భారత దేశం నిజమే
సొరకాయది చినకత్తికి తెగుగద
బక్కచిక్కినది శక్తిహీనమని


www.eTelangana.org

వర్ధమానమని ప్రచారమింకా !
శక్తని ఆరాధిస్తది విశ్వం
శక్తిహీనులను తొక్కివేస్తది
బుసకొట్టగనే ఇంత ముసముసా
క్రియాశీలురై ఏకం కండోయ్ !

బుద్ధిహీనులకు బుద్ధిని చెబుతూ
శుద్ధుడు బుద్ధుడు దీవిస్తున్నడు
భారతీయతా అణ్వస్త్రమ్మను
ధీరహారతిని ప్రవచిస్తున్నడు
అజేయ భారతి అఖండశక్తిని
జనజాగృతికై నిలుపాలన్నడు
కుంగుపూ కరాటె మార్షల్ అర్ట్సు
అస్త్రం శాంతికె బోధిస్తున్నడు !
అన్నం సంపద రక్షించంగా
అస్త్రం కావాలంటది లోకం
దుష్టుల ఆక్రమణము నిలుపంగా
శిష్టుని శస్త్రం తెస్తది నాకం.

బుద్ధుడు పుట్టిన పూర్ణిమనాడే
ప్రాఖ్రానులో అణుస్ఫోటనం
పంచశీలలను పంచిన దేశం
సంచితాణువును ప్రేల్చుటిందులకు ?





# ఆనందామృతం

- ఆచార్య కసిరెడ్డి

నా భాషను మృదులత్వముంగాంచి ఎద నెంచి
దేశ భాషలయందు తెలుగు లెస్సన్నారు
సరసమై పరిగేటి జానుతెను గన్నారు
పలుకునుడికారమున ఆంధ్రభాష న్నారు
కన్నడము కస్తూరి తెలుగుతేటే యంటు
కవిగాదు ఒక జానపదుడు ప్రవచించారు 1

నాతెనుగు నన్నయ్య విశ్వశ్రేయస్సుకై
నవ్యకావ్యము జయము రచియించియిచ్చాడు
రుచిరార్థసూక్తినిధి రూపించి చూపాడు
ధర్మవిజయముకోరి ధరనేలు మన్నాడు 2

కవిరాజు ఆనన్నెచోడు కావ్యమ్ములో
భువి తారకాసురుల పొలియించుమన్నాడు
కవి జనాశ్రయమిచ్చి శాస్త్రార్థమెరుగుమని
కవిమల్లియారేచనార్యుండు నిలిచాడు. 3


www.eTelangana.org

తెలుగు పదముల మల్లెమొగ్గలను ఏరుకొని
హరిహరుల కొకమాల గళసీమవేశాడు
గణపతుల అండతో సింహపురపతినిలిపి
జన మానసముపైన మంత్రిగావెలిగాడు 4

మారన్నకేతన్న మంచనయు జక్కన్న
ధరతత్త్వవేత్తయిన దగ్గుపలిదుగ్గన్న
నంది ఘంటల జంట నారయ్యగంగయ్య
భాస్కరుడు శ్రీరుద్ర దేవుండు మనకవులు 5

ధీవర్ధమాన పురధీరుడై వెలుగొంది
దేశద్విపదల్లోన దేదీప్య మానంగ
రంగనాథుని పేర రామాయణమువ్రాసె
కొంగు బంగారంగ గోన బుద్ధారెడ్డి 6

అలమల్లరెడ్డి వరునభిమానమును పొంది
అద్దంకి శ్రీ వేమరెడ్డి సభ దీపించి
ఆరణ్యపర్వమ్ము హరివంశమంతయును
శ్రీలక్ష్మినరసింహమును వ్రాసెఎఱ్ఱన్న 7



సంస్కృతము ప్రాకృతము శౌరసేనియు తెలుగు
సర్వభాషలవెలిగి కవిసార్వభౌముడై
రెడ్డి రాజుల కీర్తిబావుటా ఎగిరేసి
శ్రీనాథుడిచ్చె కావ్యశ్రీల ధీరుడై 8

మందారమకరంద మధురవృష్టిని కురిసి
అందాల తెలుగు పదబంధాలు సంధించి
నారద ప్రోక్తమౌ ప్రేమ భక్తిని పంచి
శారదాంబను కొల్వుమనెను శ్రీపోతన్న 9

సాహితీ సమరాంగణ స్సార్వభౌముండు
సాహిత్య స్వర్ణయుగ యోగమ్ముకలిగించె
ఆముక్త మాల్యదానందమ్ము దివ్యమ్ము
భౌమమ్మునకు దెచ్చి తెలుగులను అలరించె 10

పెద్దన్న ప్రవరుణ్ణి, ముక్కుతిమ్మన భామ
మూర్తికవి గిరికమ్మ, రామభద్రుని సీత
రామలింగని అక్క, సూరన్న భాషిణిని
ధూర్జటులకన్నప్ప, మల్లన్నశేఖరుని


www.eTelangana.org

ఛందస్సు భవనాన అందంగసరిదిద్ది
పదపదములను పూలపరిమళములొలికించి,
ఈమట్టివాసనను ఈజాతిసంస్కృతిని
తలపెట్టుమన్నారు నిలబెట్టుమన్నారు. 11

పాకాన పడినట్టి చేమకూరను జూచి
పరిపాలకులెకాదు ప్రజలు తలలూచారు
రంగాజి మొల్లమ్మముద్దు పళనుల ఎదను
రంగారు బంగారు తెలుగందగించినది. 12

పదకర్తలును శతకకర్తలును వెలిశారు
ప్రజల నాడిని పట్టి పదములను సంధించి
పరతత్త్వమందుకొన ఆటవెలదిని గూడి
వేమన్న వేదాన వెలుగులను చిందించె 13

సారంగు తమ్మయ్య పొనిగంటి తెలగన్న
కంచర్ల గోపన్న వరవీరబ్రహ్మమ్ము
దాస వేంకట దాసు ధర్మిహనుమద్దాసు
తెలుగు యోగమ్మంటు తేల్చిమరి చెప్పారు 14



అలనాటి రాయలను తలపించు సంస్థాన
ములలోన తెలుగమ్మ పలుకు కైసేసినది
అవధాన విద్యతో ప్రజలనలరించినది
సాహిత్య ప్రక్రియ సరసాలనొలికినది 15

కవులు సంస్కర్తలై కలము కదలించారు
వీరేశలింగమ్ము, గురజాడ, తిరుపతులు
కాటూరి పింగళులు, కాళ్లకూరున్నవయు
శేషశాస్త్రియు, రాజశేఖరుడు, వేదులయు
బసవన్న, తుమ్మలయు, బాపిరాట్, కుందుర్తి
నాయనియు, జాషువా, రాయప్రోలాత్రేయ
సురవరము, శ్రీకృష్ణశాస్త్రి, కరుణశ్రీయు
పఠాభి, నండూరి, వరదన్నలను తలవ
హృదయమ్ము, ఉప్పొంగి తెలుగు గంగైపారు 16

ఏటికేతముబెట్టి ఎయిపుట్లు పండించి
సామెతలు, పొడుపులును, చిన్న కథలనుపంచి
గీతాలు గాథలను గుండెలోపలినుంచి
రాగమ్ములొలుకగా రసరాజ్యముల నేలి
జానపద గాయకులు భిక్షుకులు తెలుగమ్మ


www.eTelangana.org

పాదములపైన ఎదగడ్డిపూలను ఒత్తి
కన్నీరు పన్నీరుగా కాల్వ గట్టించి
తెలుగు పొలముల నిలుప వెలుగు జిలుగులజూచి
జై తెలుగు, జై ఆంధ్ర అంటు మరిపొంగాము
జానపదుల మ్మవుతు భూమిపై వంగాము 17

కల్ప వృక్షమునిచ్చి జ్ఞాన పీఠమునెక్కి
తెలుగు కవికేతనము దేశమందెగరేసె
ఆ విశ్వనాథ కవిసమ్రాట్టు నెదనిలప
మనము సంస్కృతి మహితచిత్తులము అవుతాము
తెలగాణ దాశరథి తేజస్సు తలపోయ
కోటి రత్నాల వీణలుగ సరిపాడెదము 18

దువ్వూరి, బెజవాడ, తిలకు, మరికొసరాజు
ఆరుద్ర, శ్రీశ్రీ, మధునా పంతులందరును
తెలుగు సంస్కృతి జ్యోతి వెలిగించి నిలిచారు
ఎందరెందర గూర్చి ఎంత తలపోసెదము
అందచందాలెన్ని పట్టి చూపెదము
అందరీ సంస్కృతీ సాహితీ పీఠాన
అపురూపముగ నిలిచి అలరించిదీవించ
విశ్వంభరాధారి జ్ఞాన పీఠమునిలిచి



జాతీయ మానవత సింహాసనమ్మెక్కి
తెలుగు తేజస్సులను దశదిశల నిలిపారు
నన్నయ్య నుండి నారాయణరెడ్డి వరకు
నానుడే నిలువగా తెలుగు వెలిగించారు 19

ఈ దివ్య మూర్తులందించు జ్ఞానమ్ములో
ఈ నవ్యమూర్తులందించు యోగమ్ములో
అవబృథ స్నానమ్ము చేసి పయనిద్దాము
అమృతానంద సాహితిని సేవిద్దాము 20





www.eTelangana.org

# కచ్చపీ రౌద్రి

– స్వాతంత్ర్య భారతీ ! నవరసావిష్కృతీ !
సౌందర్య సద్గుణోన్నతి నెంచి వర్ణించ
నవనవాగ్రహ బాష్ప ధారలే ఒలికించె
నాగళము పలికించె కచ్ఛపిని రౌద్రిగా ॥

1. స్వర్ణభారతి అంటు నను పిలుస్తారేమొ
దారుణంగా నన్ను నరికేస్తు ఉంటుంటె
నారెండు భుజములను ఆనాడె తీసెస్తె
అవ్వి అతకగ దమ్ములే లేని కొడుకులూ !
నా శిరము ఖండించనరహంతకులు నేడు
నిరతమ్ము దౌష్ట్యమ్ముతో దుంకు తుంటుంటె
కుంభ కర్ణుని మించి నిద్దురోతున్నారు
అంబిలా శత్రువును కౌగిలిస్తున్నారు.

– స్వాతంత్ర్యభారతీ, నవరసావిష్కృతీ !
సౌందర్య సద్గుణోన్నతి నెంచి వర్ణించ
నవనవాగ్రహ బాష్పధారలే ఒలికించె
నాగళము పలికించె కచ్ఛపిని రౌద్రిగా.



2. ఆకాశ మార్గాన జలభూపథమ్ములో
ఆతంక వాదమ్ము ఆర్‌డీయెక్స్ వచ్చె
ఆత్మాహుతీదళము లంగలంగలు వేసె
సామాన్యులను చంపె ధీమాన్యులను చంపె
శాసనమ్ములు చేయు సభల రక్తము చిందె
బస్సులో రైలులో గుడిలోన పీనుగులె
ఝాన్సి, రాణా, భగత్, చంద్రశేఖరులేరి ?
ఛత్రపతి, నేతాజి, సావర్కరులు ఏరి ?
లాలాజి, గోవింద సింహవిక్రములేరి ?
అల్లూరి, సర్దారు, ఆంధ్రకేసరులేరి ?
పేడిమూతుల కొడుకులార ! మీసములేవి ?

– స్వాతంత్ర్య భారతీ ! నవరసావిష్కృతీ !
సౌందర్య సద్గుణోన్నతినెంచి వర్ణించ
నవనవాగ్రహ బాష్పధారలే ఒలికించె
నా గళము పలికించె కచ్ఛపిని రౌద్రిగా !!

3. తులసిపై, బాసంతి బియ్యమ్ము, పసుపుపై
వేపపై, వేద, మాయుర్వేద ములపైన



www.eTelangana.org

గోపంచకమునిచ్చు ఔషధమ్ములపైన
పేటెంటు హక్కులని పెత్రేగి పోతుంటె
గ్లోబలైజేషన్ల గోల్మాలు తెలియకే
గొడ్లలా వైదేశి విష సంస్కృతినిముద్ది
సామ్రాజ్యవాదాల ఉచ్చులోపడకండి !
పెట్టుబడులను పెట్టి ఆయుధాలను అమ్మి
పుట్టిముంచే స్థితుల వంచనా శిల్పాల
వలలోన చిక్కుకొని మసిబారిపోకండి !
దేశీయతాశక్తి దేదీప్యమానంగ
గోండ్వానానాజీని కొలువంగ రారండి !
అణ్ణాహజారేల అడుగులే పట్టండి !

– స్వాతంత్ర్య భారతీ ! నవరసావిష్కృతీ
సౌందర్య సద్గుణోన్నతి నెంచి వర్ణించ
నవనవా గ్రహబాష్ప ధారలె ఒలికించె
నాగళము పలికించె కచ్ఛపినిరౌద్రిగా

4. సంఖ్య పెరిగితెచాలు సర్వదేశమ్మునే
చక్కంగ గుప్పిట్లొ పట్టుకోవచ్చంటు



పలు ప్రలోభాలతో ఆకర్షణలు చూపి
బలహీనతలు పట్టి భూతద్దమున చూపి
మాయమర్మాలలో భారతీయత ముంచి
మతము మార్పిడి చేసి వైదేశికుల నిచట
పెంచేస్తూ ఉంటుంటె ఆస్తిత్వముంటుందొ
నా ఊరు ఉంటుందొ నాపేరు ఉంటుందొ
దిక్కునాకేలేని దైన్య దౌర్భాగ్యంలొ
చిక్కు ముళ్లను విప్పగా లేని చింతల్లొ
నా గురించింకేమి రాస్తారు–కూస్తారు !
స్వేచ్ఛావిహంగాల ఱెక్కలెట మొలుస్తాయి
ఊహలూపిరితీయకుండానె చస్తాయి
దేశి భాషలు తెల్ల గుడ్డెల్లదీస్తాయి ....

– స్వాతంత్ర్య భారతీ ! నవరసావిష్కృతీ!
సౌందర్యసద్గుణోన్నతి నెంచి వర్ణించ
నవనవా గ్రహబాష్ప ధారలె ఒలికించె
నాగళము పలికించె కచ్ఛపిని రౌద్రిగా.....


www.eTelangana.org

5. కాశ్యపీ ఖండమ్ము అజనాభ వర్షమ్ము
భువి భరత ఖండమ్ము సింధుదేశమ్మని
ఆర్ష దేశమ్మనీ ఆర్యానువర్తమని
భాస్వదుజ్వల తేజభరతవర్షమ్మని
హిందు దేశమ్మనీ హింది దేశమ్మనీ
ఎన్నిపేర్లతొనన్ను సమ్మానముగనంటె
భరతభూఖండాన్ని భరతదేశమ్మంటు
ఒక్క ఖండము కాదు ఖండ ఖండములంటు
భాషకొక పేరుతో బాదేస్తూ ఉంటుంటె
చాపచదరమ్మయ్యి ముక్కలయ్యిన రీతి
ఏది దేశము పేరా ఏది జాతీయతో
నిర్ణయించగలేని నీరసముపైకొంటె
మీరెట్లు జాతీయ వాదులై లేస్తారు !
జాతిమాతగ నన్ను నిలిచేట్టు చేస్తారు ?

– స్వాతంత్ర్య భారతీ ! నవరసావిష్కృతీ
సౌందర్య సద్గుణోన్నతి నెంచి వర్ణించ
నవనవాగ్రహ బాష్పధారలె ఒలికించె
నాగళము పలికించె కచ్ఛపిని రౌద్రిగా ...



6. కర్మమును, జ్ఞానమును, ధ్యానమును, యోగమును
ధర్మమును, అస్తిత్వవాదమ్ము, బ్రహ్మమ్ము
మోక్షమ్ము, యజ్ఞమ్ము, భక్తి, నిర్వాణమ్ము,
ఆధిభౌతిక–దైవ–మధ్యాత్మ భావమ్ము,
జీవ–ప్రకృతి–మాయ–భావమ్ము–దైవమ్ము
స్థూల–వైరాగ్యమ్ము, సూక్ష్మ–కిరణములును
ఎన్నెన్ని పదములో ఎన్నెన్ని వాదాలో
వక్రభాష్యము పొందె వైదేశికుల వేత
భావబానిసలైన స్వీయదేశీయులున్
వారి వాదాలకే తలలొగ్గి నడవంగ
దివ్య వృక్షము యొక్క వ్రేళ్లు చీడనుబట్టి
పూతలా ! కాతలా ! ఫలములా ! రసములా !
భూమి బిడ్డల జన్మములు నిష్ఫలమ్ములా !

– స్వాతంత్ర్య భారతీ ! నవరసావిష్కృతీ!
సౌందర్యసద్గుణోన్నతి నెంచి వర్ణించ
నవనవా గ్రహబాష్ప ధారలె ఒలికించె
నాగళము పలికించె కచ్ఛపిని రౌద్రిగా.....



www.eTelangana.org

## పిలుస్తున్నది జమ్మూ కాశ్మీర్

(ప్రధానమంత్రి శ్రీ అటల్ బిహారీ వాజ్‌పేయ్
"జమ్మూకీ పుకార్" కవితకు అనుసరణం)

ఉగ్రవాదం మరోసారి
మృగంలాగ గర్జిస్తున్నది
అత్యాచారుల దమననీతి
ఖడ్గధారను తర్జిస్తున్నది

కళ్ల ముందటి నిత్యసత్యం
ఖతం ఖతమై స్రవిస్తున్నది
భారతాంబ సహస్రశీర్ష
మ్ముందు ఒక్కటి కదులుతున్నది

ఏమిటిది దేశమ్ము మళ్ళీ
చీలి ముక్కలు చెక్కలవునా!
రక్తసిక్తమ్మయి ధరిత్రీ
నెత్తుటేరుల రుదిస్తుందా !
ఎంతవరకీ అసురమాయల
జ్వాలలిచ్చుట క్రమిస్తాయి!



ఏమి భస్మాసురుని అడుగులు
ఎన్ని నాళ్లిల స్పృశిస్తాయి
ఎంతవరకీ జమ్ము ప్రాంతం
జ్వలించంగా సహిస్తామో!
ఎంతవరకీ హింసామద్యం
స్రవించంగా వహిస్తామో !
ఎంతవరకీ లాఠీగోళీ
మౌనులంగా భుజిస్తామో!
ఎంతవరకీ శత్రుమూకలు
రక్త హోళీలాడుతాయో!

సహనమునకొక హద్దు ఉంటది
అబ్ధి కడుపున అగ్గి ఉంటది
మలయపవనం తుఫానవుతది
భోళా శంకరు ఫాలనేత్రం
తప్పకుండా విచ్చుకొంటది.
పిల్లాజెల్లా ధన వ్యామోహం
ప్రాణప్రీతి ఎవరికుందో !
వారు దూరంగా ఉండండీ !
పాంచజన్యం ధ్వనిస్తున్నది
ఉగ్రవాదం చూచి భయపడి
యుద్ధోన్ముఖులై పోని పందలు
గాజులను ధరియించి గృహమున
కదలకుండా కూరుచోండి !



www.eTelangana.org

చెల్లి ముఖమున ఉమిస్తుంది !
తల్లి చెవి మెలివెట్టుతుంది !
సిగ్గువిడిచిన మానసింహుని
వంశమున ప్రభవించినారో
అయితే ఇంటికి మళ్లీ మళ్లీ
నిప్పు పెట్టండీ !

కాని సత్యం గ్రహించండీ !
న్యాయరహితుల లంక ఉండదు
బిడ్డలుండగ తల్లి శీర్షము
ఎగిరిపోయిందంటు ఎవ్వరు
పలకకుండా చూచుకోండీ !
దురాక్రమణుల దుష్టచర్యలు
మౌనముగ భరియించినారని
తిట్టకుండా కాచుకోండి !

రారా సోదర ! రక్తలేఖినితో
చరిత్రను వ్రాయగా
కంటకావృత పథముపై – నీ
కాలు మోపగ నిర్భయంగా
కాశిమీరం తలుస్తున్నది
జమ్మూ సీమా పిలుస్తున్నది
ఉదాసీనత నుజ్జగించర
ఖండ భారతవాసి రా – రా !!!
అఖండ భారతవాసి రా – రా !!!



# మలుపులో...

(ప్రధానమంత్రి శ్రీ అటల్ బిహారీ వాజ్‌పేయ్
"మోడ్‌పర్" కవితకు స్వేచ్ఛానువాదం)

దూర తీరములందు నుండిన
దృష్టి కగు పడుతుంది వస్తువు
అచటి కుడ్యముపైన వ్రాసిన
ఆప్త హృదయము అందగలనోయ్
ఆశ్చర్య మీచేతి గీతలు
అతి సమీపము చదువలేనోయ్ 1

హద్దులో సరిహద్దులో గల
అగ్గి మంటలు అగుపిస్తున్నవి
కాళ్ల అడుగున వేడి బూడిద
కళ్ల కగుపడకుండ ఉన్నది 2

మాయ ఏమిటో మర్మమేమిటో
మసక చీకటి మతలబేమిటో
దూరమున్నది కనిపిస్తున్నది
దగ్గరున్నది కనబడకున్నది


www.eTelangana.org

నేను వృద్ధుడనైతినా ! మరి
నేను కృద్ధుడనైతినా !
ప్రతి డిసంబరు ఇరువదైదున
బ్రతుకడానికి క్రొత్త నిచ్చెన
వెతికి మెట్లను ఎక్కెదన్
స్వయం శక్తితో పుంజుకొంటా !
వెనకబడనే ముందుకుంటా !
యుద్ధరంగమునందు ఉంటా !
విజయగమ్యము నందుకొంటా ! 3

ప్రజలగుంపది దండి గుండని
వాగ్వివాదము జరుగకుండా
వారు మౌనుల మాద్రికాగా
గోడ బొమ్మల బోలి నిలువగ
నే సమాధానమ్ము చేస్తా !
కాని ఏమిటో నాకు నేనే
సమాధానం పొందలేనోయ్ !
నా అదాలతులోన నన్నే
నామనసు నిలదీయునోయ్ !



నిట్ట నిలువున నన్ను నిలుపును
క్రాస్ పరీక్షను మొదలుపెట్టును
చిత్తమిది నా ఎఫిడవిట్టూ
నాకు వ్యతిరేకంగ నిలుచును
ఏమిచేస్తా దిశలు చూస్తా
నేను కేసే ఓడిపోతా !
నాదు దృష్టికి నేనె నేనె
నలిగి దోషిగ నిలిచిపోతా !

అపుడు దృష్టికి అందదెయ్యది
దూర తీరాలందునున్నది
అతి సమీపము నందునున్నది
అపుడు దృష్టికి అందదెయ్యది
ఈ వయస్సా ఓపదేళ్లూ
చకచకా పైబడత దండీ !
ప్రతి డిసంబరు ఇరువదైదున
నేను వృద్ధుడనైత నండి !
నేను యువకుడనవుతనండీ !



**(డిసంబరు 25 శ్రీ అటల్జీ పుట్టినరోజు)**



www.eTelangana.org

# అమృత కణాలు

నేను అమ్మను బిడ్డలారా !
రెండు చేతులు నాడు కొట్టిరి
నేడు నెత్తిన కొట్టుతున్నరు
కుంభ కర్ణుల నిద్రనాయిక ! 1

కట్నాలు కానుకలు కలికినే యేడ్పించె
కన్నీటి కొలనులో కనులు తడితడి ఆయె
అట్టి కన్నులు చూచి కవులేమి అన్నారు
గట్టిగా మీనాల లోచనలు అన్నారు 2

పిల్ల పిలగాడుంటె ప్రణయమ్ము అంటారు
పిల్లలే ఉన్నచో ప్రళయమ్ము అంటారు
పిల్లలును తల్లులును తండ్రులును మరి ఉంటె
ఎల్లలోకమ్ములో ప్రణవమ్మె అంటారు 3

హృదయ సరసున పురుగులుంటే
అదయ గుణమున నేరివేస్తా !
కమల వనముగ దాని జేస్తా!
అమల పరిమళ మలదుతా ! 4

ప్రజల గొంతులు కోయువారలు
పలువలవుదురు పశువులవుదురు
ప్రజల ప్రాణము నిలుపు వారలు
పశుపతులుగా భువి నిలిచిపోదురు 5

తొడిమ ఊడక చూచుకొంటే
వాడి పోదోయ్ ప్రేమపుష్పం
తల్లి వేరుకు ఎడం సేయకు
మల్లి బ్రతుకును మాయ నీయకు 6

పడతి పరువపు కంటి అగ్గికి
కొండ గుండెలు కాలిపోతవి
వెన్నలై పూరుషులు ఉంటె
చిన్నగా మరి కరిగి పోరా ! 7

చిన్న పూవా సిత్తరంగా
వన్నె నవ్వును రువ్వినావే !
దూది కొండకు కొండంత నిప్పు
ఎందుకని గ్రహియించినావె ! 8


www.eTelangana.org

నాటి సంతన జాతిరత్నాల్
నేటి యంగడిలోన బాంబులు
అవ్వి దేహపు కాంతులిచ్చును
ఇవ్వి ప్రాణములే హరించును ! 9

కాకి గూటిని పెరగవచ్చును
కోకిలలు గానమ్ము వీడవు
భారతీయులు ఎచట ఉంటే
అచటి రాగము లేవి వాడవు 10

పల్లె కొండలు పూలు పూస్తవి
పూలలో పరిమళములుంటవి
నేడు గన్నులె పూస్తు ఉన్నవి !
పూలు నెత్తురు కక్కుతున్నవి ! 11

రైతుహస్తము తాకగానే
పుడమి సుందరి పులకరిస్తది
పులకలే మరి మొలకలవుతై
మొలక లెదిగి ఫలమ్ములిస్తవి 12



దాచబడ్డది దోచబడుతది
పూల తేనెను భ్రమరి దోస్తది
తేనె పట్టును దోచుతెరువరి
దొరలు లేరిట దొంగలందరు ! 13

కోతకోస్తే తిండి దొరకును
ఈ రహస్యము నేత లెరిగిరి
కోతలే మరి కోస్త ఉన్నరు
దేశ కోశము దోస్త ఉన్నారు ! 14

తనకు ఒక్కడు హాని చేయగ
విమర్శించుట మనిషి ప్రకృతి !
తాను ఒకనికి హాని చేయుచు
సమర్థించుకొనుట వికృతి 15

మనిషికాకలి సహజ ప్రకృతి
దోచితింటే అదే వికృతి
ఆకలయ్యిన వానికింతా
అన్నమిడితే అదే సంస్కృతి !! 16


www.eTelangana.org

స్తంభ సదృశులు నేతలందరు
సౌధముల నిలబెట్టు స్తంభము !
స్తంభమే ఈనాడు పుచ్చెను
సౌధములు పడి పోవ వచ్చెను 17

గడ్డి తింటది పాలనిస్తది
ఎడ్డె గేదెకు బుద్ధి ఉన్నది !
గడ్డి తినియెడు దేశ నేతలు
కూస్తరండీ జాస్తి కూతలు ! 18

గల్లి గల్లికి గోతులుంటే
పల్లె పల్లెల నీళ్లు ఉంటవి
మనిషిక్రిందా గోతి తీస్తే
నీళ్లేడ ? కన్నీళ్లుఉంటవి ! 19

ఠీవితో బ్రతుకంత నేర్పిరి
జీవితాలకు మా మహర్షులు.
రేబవళ్లంటిల్ల అయ్యిరి
టీవికే పిల్లలు బలయ్యిరి ! 20



ఇచట పుట్టిన వారి చంపితే
ఎచటి వారలు ఏమి కూయరు
ఎదురు దెబ్బలు తీస్తె మాత్రం
మతోన్మాదం నోరు మూయరు 21

ఓటు బిచ్చం ఎత్తినప్పుడు
మాటమూటలు కుమ్మరించుకొ !
ఎన్నికవగనె ఎంత చక్కగ
అన్ని నీకులపోళ్ల కిచ్చుకొ 22

నీమతమ్మును నీదు సంస్కృతి
నిట్ట నిలువున పాత రేసేయ్
లేకపోతే మైనార్టీలు
నీకు ఓట్లను వేయరోయ్ 23

హిందు సంస్కృతి ఊసు ఎత్తకు
హిందు జాతను మాట చెప్పకు
హిందు ధర్మం జోలివిప్పకు
హిందు దేశం ఏలికవుతవు 24



www.eTelangana.org

## సంస్కృతి ఎక్కడ !

మన భాషమనకొద్దు
మన సంస్కృతియు వద్దు
మన ధర్మమును వద్దు
మన జాతి వీరులను
మనము స్మరియించొద్దు
సంగీతమును వద్దు
సాహిత్యమును వద్దు
ఇది అభ్యుదయ మీదు
ఇది విప్లవము తేదు
ఇజమైన నిజమైన
వైదేశికతలోనె
విహరిద్ద మంటోంటె

వేదోపనిషత్తులును
దర్మనమ్ములు స్మృతులు
బహు పురాణమ్ములును
భాగవత తత్త్వమ్ము



జయ భారతమ్ములును
రామాయణమ్ములును
గీతలును నామములు
దివ్య కావ్యమ్ములును
నవ్య నాట్యమ్ములును
భవ్య సంగీతములు
వ్యాస ఋషిబోధలును
బౌద్ధ తత్త్వమ్ములును
నారదుని సూత్రములు
యోగవాశిష్ఠములు
శంకరుల చింతనం
రామానుజులబోధ
మధ్వ ద్వైతమ్ములును
చైతన్య జీవనం
చదివేది ఎవ్వరూ !
సంస్కృతీ పథములో
సాగేది ఎవ్వరూ ?

ఈ ప్రశ్నలకు బదులు
చెప్పగా లే లెండి !
జిజ్ఞాస పథములో
జేతలై రారండి !
జయభారతమ్మును
జగతిలో చాటండి !



www.eTelangana.org

# భారతులు

1. గూడులోనీ పిట్ట రాలి పోకుండంగ
క్రింద పడి కొట్టుకొని చచ్చిపోకుండంగ
పచ్చ పచ్చని ఆకు కాలి పోకుండంగ
పరిమళమ్ముల పువ్వు వాడి పోకుండంగ
ఎవ్వారు చూస్తారొ వారు మా భారతులు

2. వర్ణ భేదము విడిచి వర్గ వాదము విడిచి
స్వర్ణ భారతి కొరకు దిన దినము పాటుపడి
మతపు రంగును వదలి మాయ మతలబు వదలి
మానవత జాతీయ వాదియై నిలుచుండి
ఎవ్వారు వెలుగుదురొ వారు మా భారతులు

3. ఒక భాష ఎగదోసి ఒక భాష సగదోసి
వికృతులు కలిగించు వారి తప్పులు తెలిపి
భారతీయాత్మ ప్రతి భాషలో ఉందంటు
అకలంక భావాలు చాటగా ఎదనిలిపి
ఎవ్వారు ఉందురో వారు మా భారతులు.



4. మత వాద దేశముల మారణోద్ధతి భీతి
మానవుల నందరిని కల్లోలమున ముంచ
ఉగ్రవాదము నణచి వేయగా నినదించి
తన దేశ ప్రజల సౌభాగ్యమ్ము తలపోసి
ఎవ్వారు నిలుతురో వారు మా భారతులు.

5. ఒక్క రాజ్యాంగమ్ము ఒక జాతికుంటుంది
ఒక్క నీతే రీతి దేశానికుంటుంది
జాతీయ ధర్మమ్ము జెండా అదొక్కటే
ఇవి గాఢముగ నమ్మి పదిమంది నడవగా
ఎవ్వారు తలుతురో వారు మా భారతులు.

❄ ❄ ❄



www.eTelangana.org

## భరతం పట్టిస్తా !

విదేశీయ విషనాగం
స్వదేశీని కాటేస్తే
నిదురపోను బెదిరిపోను
నీ కోరలు పీకేస్తా !

నాదు జన్మ భూమి నెన్ని
మార్లు మ్రింగ తలచారో !
ఇక ఆటలు సాగవురా
సింహాన్నయి తరిమేస్తా !

కుల మతాలు రెచ్చగొట్టి
గోడ లెన్ని కట్టారుర !
హిందూ జన శక్తి లేపి
మీ ఆటలు కట్టిస్తా !

మీ మతాల కలుపుకోగ
మాయ లెన్ని చేస్తున్నరు
మా మతాల వారి లేపి
మీ భరతం పట్టిస్తా !





## బానిసలు

కుల ప్రాతి పదికపై
మత భావ వేది పై
భరత దేశ ప్రథమ
పౌరు నెన్నిక యంట !

వ్యక్తి నైపుణ్యమ్ము
గంగలో త్రోయండి !
జ్ఞాన నిపుణత ప్రతిభ
ప్రాణాలు తీయండి !

వర్గ కలహము పెంచి
సిగ్గుతో క్రుంగండి
భారతీయత చంపి
బూడిదై మిగలండి !

పార్టీలకై జాతి
పణముగా పెట్టండి
ప్రభుత కొరకై బ్రతుకు
పందెమ్ము కాయండి !



www.eTelangana.org

మనిషి బ్రతుకును మరచి
మతమునే కొలవండి !
మానవత్వము వీడి
మనుజులను చంపండి !

జాతి భవితవ్యమ్ము
ఖ్యాతి రీతిం కేల
బానిసత్వపు పాత
బాటలే ఇవ్వేళ.





## సంబరాల సౌరు

పల్లవి : సంక్రాంతి సంబరాల సౌరు చూద్దమా !
(అయ్యా అమ్మ ! అక్కా చెల్లి ! అన్నా తమ్మి !)
సౌజన్యం అంబాపలుకు సంచరిద్దమా !

1. అంగవస్త్రమిచ్చి గంగిరెద్దు కొలుద్దమా !
అంగాంగం చలికి వణకకుండ చూద్దమా !
– ఆవు లెడ్ల కండల బిర్యాని తింటిమీ !
అంగ వస్త్రాల్ విడిచేసి ఆరగిస్తిమీ ! ॥సంక్రాంతి॥

2. నవ ధాన్యల్ కూర్చుకొని దాచి పెడదమా !
జవ సత్త్వాల్ ఖర్చుచేసి పంట దీద్దమా !
– బీటీ పత్తి విత్తనాల పంట వేస్తిమీ
విదేశీయ దంకెళ్ల వింత చూస్తిమో ! ॥సంక్రాంతి॥

3. పాల నురుగు నట్టింట్లో పొంగు చేద్దామా !
పాయసమ్ము పొంగలితో పరవశిద్దమా !
– రంగు హంగు బీరు బుసాబుసా పొంగెనూ !
భంగు రేగి బడా బడా మత్తు తెచ్చెనూ ! ॥సంక్రాంతి॥



www.eTelangana.org

4. హరిదాసు నెత్తి గుమ్మడి ధాన్యమేద్దమా !
అందరికీ సేవ చేయ దాన మిద్దమా !
మతం స్కూళ్ల కారట్ల గళ్లు నింపిస్తిమీ !
మంచి సేవ ఇదియని మరి దారి చూపిస్తిమీ ! ॥సంక్రాంతి॥

5. పెద్ద గొబ్బి మధ్య బెట్టి గొబ్బిళ్లందమా !
విశ్వాత్మ చుట్టు జీవాత్మల తిర్గుడందమా !
– యు ఎస్ ఏను జేష్ట దేవి చేసి కుడిస్తిమీ
యూజ్‌ఫుల్‌గ పబ్బతి పట్టి పాకుతుంటిమీ ॥సంక్రాంతి॥

6. ముంగిట్లో ముగ్గులు వేసి వ్యూహాలందమా !
సౌర శక్తి సూర్య రథం స్వాగతిద్దమా !
– విదేశీయ పెట్టు బదుల ముగ్గు మున్గితిమీ
స్వదేశీయ ఉత్పత్తుల చావు గోర్తిమీ ॥సంక్రాంతి॥

7. తిలల బెల్లం తియ్యదనం పంచుకొందమా !
బలం దేహ శక్తి యుక్తి పెంచు కొందమా !
– మాసాజు నిలయాల్లో మరిగి పోతిమీ
ఉన్న శక్తి ఊడ జావగారి చూస్తిమీ ॥సంక్రాంతి॥



8. ఉత్తరాయణం కాలం గొప్ప గొప్ప అందమా !
తమస్సు నుండి ఉషస్సులోకి అడుగు వేద్దమా !
– ఉత్తరాల దక్షణాల కమ్ముడు పోతిమీ –
చీకటి వ్యాపారాలను చిటుక లేస్తిమీ ॥సంక్రాంతి॥

9. భోగి భోగి మంటల జీవయోగాలందమా !
దాగి ఉన్న విషక్రిమి సంహార మందమా
– ఉగ్రవాది బాంబులతో మంటలేస్తిమీ
దేశీ జన ప్రాణాల్ బలివేది చేస్తిమీ ॥సంక్రాంతి॥

10. కాటి పాపల కాల చక్రం జోష్య (స్య) మందమా !
పిట్టల దొర గప్పాల్ వ్యంగ్యచిత్ర మందమా !
– పిచ్చి శాస్త్ర మిది అంటూ గేలి చేస్తిమీ !
ప్రగల్భాల దొరను జూచి నవ్వు కొంటిమీ ! ॥సంక్రాంతి॥

11. కోడి పుంజుల పోట్లాటలు పౌరుషమ్ములా
గొఱ్ఱె దున్నపోతులాట సాహసమ్ములా
– పైస వెట్టి పందెం పుంజు పాడు చేస్తిమీ
పసుల పోరు చూసి పోరు బాట వడ్తిమీ ॥సంక్రాంతి॥

12. గాలి పటాలాడి గగన మార్గమందమా !
జీవాత్మకు పరమాత్మకు సూత్ర మందమా !
– సూత్రాలను తెంపి కటీ పతంగంటిమీ
చిత్రంగా ప్రేమ మరిచి చిరుబురులాడ్తిమీ ॥సంక్రాంతి॥


www.eTelangana.org

# స్వాతంత్ర్య వీరుడు

(ప్రథమ భారత స్వాతంత్ర్య సంగ్రామంకన్నా పది సంవత్సరాలముందే బ్రిటీషు వారితో పోరాడి వారిని హడలగొట్టి, 1847 ఫిబ్రవరి 21వ తేదీన ఉరితీయబడ్డ **స్వాతంత్ర్య సమరవీరుడు ఉయ్యాలవాడ నరసింహారెడ్డి** మనస్సులో మెదిలినప్పుడు ఉబికిన భావ వీచిక.)

❄ వీరాధి వీరుడు విప్లవ వీరుడు నారసింహారెడ్డి
పోరాటమ్మున ఆరితేరెను నారసింహారెడ్డి
బ్రిటీషు వారిని ముప్పుతిప్పలు పెట్టినాడు రెడ్డి
రేపూ మాపూ వీరుని కథను వినగా రారండి ॥

1. రాయల సీమలో "నొసము" ప్రదేశం జయరామిరెడ్డి
రాజ్యమేలుతూ పేరు ప్రతిష్ఠలు పొందె వేల్పుగడ్డి
బ్రిటిషువారు రెడ్డికి వార్షిక భృతినిస్తున్నారు
కూతురు కొడుకును దత్తతగొనెను జయరామిరెడ్డి
అట్టి మనుమడే వీరుడు ధీరుడు నారసింహారెడ్డి
ఆటపాటలలో ఆరితేరెను చదువు సంధ్యలంధు
సాముగరిడీలు గట్టిగనేర్చెను నారసింహారెడ్డి
ఆర్తత్రాణుడు అన్న పేరును పొందినాడు రెడ్డి ॥



2. గుఱ్ఱమెక్కి తాఖడ్గము చేత పట్టుతాడు రెడ్డి
వ్యావసాయికా క్షేత్రములెన్నో కాపాడెనురెడ్డి
ప్రజల క్షేమము కోరి పనులను ఎన్నో చేశాడు
దానధర్మమూ లెక్కకుమిక్కిలి చేసినాడు రెడ్డి
కోయిలకుంట తహసిల్దారు తలబిరుసును చూసి
రాజభరణము తీసుకొనుటకూ వెళ్లలేదు రెడ్డి
తన సేవకుని పంపగ ఆతడు అవమానించాడు
అసలుదాసరి వస్తేనే మరిఇస్తానన్నాడు.
ఆమాటలువిని శిక్షించాలని బయలుదేరె రెడ్డి
అంగరక్షకులు అనుసరించగా బయలుదేరె రెడ్డి ॥

3. కోయిలకుంట మీదికి దండు వస్తుండగ చూచి
ఆలోబలోమని ఆ ప్రజలంత హడలిపోయినారు
భయపడవద్దని వారికి అభయము ఇచ్చినాడు రెడ్డి
ఒడ్డె ఓబన్న తోడు నిలువగా కదిలినాడు రెడ్డి
తహసిల్దారు పారిపోవగా తరిమికొట్టి నాడు
దాగిన ఇంటిని చుట్టిముట్టితా తలను నరికినాడు
తహసిల్దారుకు తోడుగ నిలిచిన సింగుకూడ చచ్చె
జైజై అంటు ఊరేగింపులు తీసినారు ప్రజలు ॥



www.eTelangana.org

4. చెన్నపురములో ఆంగ్లేయులందరు హడలిపోయినారు
ఉయ్యాలవాడలో నొసంకోటలో రెడ్డి ఎక్కడున్నా
బంధించాలని హుకుం అప్పుడే జారీ చేశారు
భారతీయభట సైన్యమ్ములనే ఆజికి పంపారు.
ఉయ్యాలవాడకు వచ్చి చిత్తుగా ఓడిపారినారు
వ్రేలూ మనదే కన్నూ మనదే జాగ్రత్తన్నాడు
క్షమాభిక్షతో అందర విడిచి సాగనంపినాడు
యుద్ధవ్యూహములు పన్నగ తలచి కొటకేగి నాడు ॥

5. ప్రజానీకమును సమాయత్తముగ చేయదలచినాడు
పొరుగున ఉన్న ఔకు రాజును సంప్రదించినాడు
దళములు కూర్చి సైన్య శిక్షణము ఇవ్వగసాగాడు.
రెడ్డికాదుబంగారపు కడ్డని పిలువగబడినాడు
కరవు వచ్చినా కాటకమొచ్చిన కరుణించే ననుచు
రెడ్డి కోసమూ ప్రాణం ఇవ్వగ నిలిచినారు జనము
నీటిమీదను బుగ్గవంటిది నరుని దేహమంటూ
అందరు కలిసిన ఆరువేల సేన అండగ నిలిచినది ॥



6. ఆంగ్లేయుల అధిపతి "కాక్రన్" వ్యూహము పన్నాడు
నాయకత్వము 'వాట్సన్' కిచ్చి సైన్యము పంపాడు
నొసముకోటపై దండుతీసుకొని దుమికినాడు వాట్సన్
ఎత్తులువేసి చిత్తుచేయగా ఓడిపోయెవాట్సన్
ఉయ్యాలవాడ నారసింహుడన హడలి పోయెవాట్సన్
వాట్సన్ సేనను బోయలదండు చీల్చి చెండివేసె
నిలువనీడనూ అన్వేషిస్తూ పారిపోయెవాట్సన్
విజయోత్సాహము వెల్లివిరియగా రెడ్డి నిలిచియుండె ॥

7. నల్లమలయడవిలో ఉన్న కోటను గట్టిగ కట్టించె
మార్గాలన్నీ, దుర్భేద్యంగా మళ్లీ నిర్మించె
అడవులపైగల 'రేంజరు' దౌష్ట్యం ఎండగట్టినిలిచె
బుద్ధిహీనునికి బుద్ధి చెప్పగా పిలిచి హెచ్చరించె
అత్యాచారి బ్రిటిషు రేంజరును శిక్షించగనెంచె
దుష్టుని భ్రష్టుని ప్రజలకొరకునై సంహరించిమించె
రావణు బోలిన రేంజరు వధకుప్రకృతి పులకించె
రామ రాజ్యమే మాకు వచ్చెనని జనతయు హర్షించె ॥



www.eTelangana.org

8. నార్టన్-వాట్సన్-లెందరెందరో ముందుకు వచ్చారు
కోటదగ్గరకు రాకుండానే కొందరు చచ్చారు
గిద్దలూరులో జరిగిన పోరులో హడలగొట్టెరెడ్డి
తెల్లసైనికులు ఎందరెందరో నేలకొరిగినారు
నార్టన్ తదితరులందరు కూడా పారిపోయినారు
రక్షణ కొరకు నల్లమల కోటకు రెడ్డి చేరినాడు
కాక్రెనెంతో సుక్షితసైన్యం నార్టన్ కంపించె
కోడ పట్టగా సైన్యంరాగా పోరాడెను రెడ్డి ॥

9. నెలల కొలదిగా భీకరమైన పోరాటము జరిగె
ఓబన, వెంకన లెందరొ రెడ్డికి అండగనిలిచినారు.
స్త్రీలను వృద్ధుల నందర గూడా పంపించేశాడు
కోట గోడలు ఫిరంగి ధాటికి నిలువలేకపోయె
రెడ్డి సైన్యమున మహావీరులు చచ్చిపోయినారు
మూడు వర్షముల ఈయుద్ధమ్ము అతి విచిత్రమండి !
మూడు వేల సుసైన్యము చచ్చెను అడలలేదు రెడ్డి
నల్లమలనూ వదిలిపెట్టెను అడవిలోకి వెళ్లె ॥



10. నల్లమల నుండి ఎఱ్ఱమలవైపుగ సాగినాడు రెడ్డి
అట్టి అడవిలో నరసింహస్వామి ఆలయముందండి !
అది నివాసముగ ఒంటరిపోరును సాగించెను రెడ్డి
మలకు పక్కనే ఆల్వకొండలో జానకమ్ముంటుంది.
ఆమె అన్నము రెడ్డికి పంపును కిష్టప్పకు ఇచ్చి
ఆకిష్టప్పను ఆంగిలేయులు బుజ్జగించినారు
అన్నములోన మత్తు మందును కలిపి పంపినారు
ఆ విధముగా తానన్నముతిన్న రెడ్డి పట్టువడెను.
పద్దెనిమిదొందల నలుబది ఏడు జనవరితొమ్మిదిన
ఆంగ్లేయుల మిలటరి కోర్టు ఉరి శిక్షను వేసె
పద్దెనిమిదొందల ఫిబ్రవరి నెలలో ఇరవయ్యొకటిన
అట్టి శిక్షను కోయిల కుంటలో అమలు పరిచినారు
ఆ తర్వాత శవము శిరస్సును నరికి వేసినారు
కోవెలకుంట్ల ద్వారంపైన శిరసుకట్టినారు
ముప్పయ్యేళ్లు రెడ్డి శిరస్సు అక్కడే ఉందండి
స్వాతంత్ర్యవీరుని ప్రజలు స్మరించి జైజై కొడతారు
ఆయన పేరును తమ పిల్లలకే పెట్టుకొంటరండి !
అట్టి వీరుని చరితను తలచిన స్ఫూర్తి కలుగునండి !
ఉయ్యాలవాడ నారసింహుడే ప్రేరణ మనకండి !
జైజై భారత ధర్మ వీరులై అందరు నిలవండి !





www.eTelangana.org

# ప్రణవం

ఒక ప్రణవ నాదమ్ము ఏకపది - వాణియై
సకలోహ లోకమ్ము సక్రమముగా నిలిపె
సావిత్రిగా మారి ద్విపదయై కాంతియై
కోవిదాళిని మింటి మంటికై కదలించె
వెంటనే రెండింతలై చతుష్పదమనెను
ఋగ్వేధి మంత్రతంత్రమ్ములను వినుమనెను
కర్మిష్టియై యజుర్యోగమ్ముకనుమనెను
సామ గాంధర్వాన అధర్వణమ్మనెను

శిక్షయై వ్యాకరణలోకమై ఛందమై
నైరుక్త కల్పమై జ్యోతిషము ధర్మమై
ధర్మా శాస్త్రాద్యష్టపదియయ్యె మొదలయ్యె
మీమాంసయై న్యాయ సాంఖ్యయోగమ్మునై
పాశుపతశాస్త్రమై శ్రీధనుర్వేదమై
ఆయురన్నము సుమ్ము వర ఆయుర్వేదమై
గాంధర్వవేదమై నవపదియనంతమై



వాణి అంతర్వాణి ఆనందరూపమై
మా యమ్మసారస్వతేయమ్మ కదలినది
కదలినది కదలినది రసధారలొలుకగా
ఏకాక్షరమ్ముగా పదముగా వాక్యముగ
కోటికోటి గళాల చేతనాత్మమ్ముగా
నీలోన నాలోన భావమై మెదలినది
నీలోన నాలోన నాదమై కదలినది
నీలోన నాలోన అక్షరము నిలచినది
ఆంతరికభావమ్ము నాదమ్ము అక్షరము
దూరాంతరంగాలనే కాదు కలిపినది
దోర్దండముల కలిపి ప్రేమలను పంచినది
సృష్టికొనసాగగా వలపులను ముంచినది

వేదమై మోదమై ఋగ్వేధి నాదమై
వాదబోధిత రూప కాంతికే ప్రాణమై
పాంచభౌతికమైన దేహాన ఉన్నట్టి
అంచితమ్మగు దివ్య చేతనాత్మమ్మువై
గంగయమునల మధ్య శూన్య జీవనమవై
సింగారములు చిలుకు భవ్య చైత్యాగ్నియై



www.eTelangana.org

ఉన్న నిను స్థూలముగ మిన్నగా సూక్ష్మముగ
కన్నదీ జగమంత కారణమ్ముగ గూడ
కాని దౌర్భాగ్యమ్ము మేమెన్నుకొన్నట్టి
నాయకమ్మన్యులే కుర్చీల కూర్చొని
ధర్మరహితమ్మైనదీ పార్లమెంటంటు
నిన్ను కొలువక పోతె నిన్ను తలవకపోతె
కర్మవారిదిగాని జనవాణి వీవమ్మ
ఘనవాణి వీవమ్మ గుణవాణి వీవమ్మ
దానమ్మునీవమ్మ జ్ఞానమ్ము నీవమ్మ
మాయమ్మవీవమ్మ మాయమ్మవీవమ్మ

అమ్మ సారస్వతీ ! ప్రణవమ్ముతో ప్రణయ
నాదమ్ముతోమమ్ము బంధించినావమ్మ !
నీబంధనమ్ములో నిత్యమై సత్యమై
నిర్నిద్ర గానమ్ము మేము చేస్తామమ్మ
నీ ఉపాసనలోన మునిగిపోతామమ్మ
నీవె మేమైపోయి నిలచిపోతామమ్మ !





# ధాతకు ఎందుకు వీడ్కోలు ?

నేతలు త్రాతలు ధర్మాత్ములమని గడ్డిని కమ్మగతిన్నారు
గడ్డిని తింటే ఆవుల వలెనే పాలిస్తారని తలచారు
– గడ్డిని మనుషులు నందీశ్వరయని ఇప్పుడు కూడా తింటారా!
ఇప్పుడు తింటే ధాతకు ఎందుకు వీడ్కోలివ్వగ కదలాలి.

నాయకోత్తములు చేలకొరకు అని ఎరువుల సంచులు మ్రింగారు
ఎరువులు మ్రింగితె చెలమాదిరే పంటలిస్తరని తలచారు
– ఎరువు మసాలలు సస్యేశ్వరయని స్వాహాకారముచేస్తారా!
ఇప్పుడు చేస్తే ధాతకు ఎందుకు వీడ్కోలివ్వగ కదలాలి.

మీతలరాతలు ఇంతే ఢిల్లీ భవనాల్ మావే అన్నారు
కొంపాగూడూ కుంపటిస్తరని గ్రుడ్లుమిటకరించి చూశారు
– వరుసల ఫ్లాట్సు భవనేశ్వరయని మాస్థిరాస్తులవి అంటారా!
ఇప్పుడు అంటే ధాతకు ఎందుకు వీడ్కోలివ్వగ కదలాలి

లౌకిక వాదం జపమును చేస్తూ కోట్లు ఓట్లకై పంచారు
కోట్లు కల్యాణమాకింకవస్తవని జనగణమనములు తలచాయి
– సంతృప్తీకరణమ్ము చేయుచూ కుర్చీశ్వరయని అంటారా!
ఇప్పుడిట్లంటే ధాతకు ఎందుకు వీడ్కోలివ్వగ కదలాలి


www.eTelangana.org

మద్యం వద్దని చాటుమాటున చుక్కపైచుక్క వేశారు
మందుబందుఅని మంచిచేస్తరని మనవాళ్లందరు తలిచారు
- పైసాపైసాపైసేశ్వరయని మందుబాబులై పోయారు
ఇప్పుడిట్లయితే ధాతకు ఎందుకు వీడ్కోలివ్వగకదలాలి

మైకేల్‌జాన్సన్ మనీకల్చరుకు శివసైన్యాల్ తలఒగ్గాయి
మనీకొరకు మనకల్చరునమ్ముట కలలోనైనా తలిచామా
- రామరామయని రావణేశ్వరుని తలపైనిడుకొనిమోస్తారా
ఇప్పుడు మోస్తే ధాతకు ఎందుకు వీడ్కోలివ్వగకదలాలి

బొంతలు బొంతలు కుట్టుకుట్టుకొని వింతగపీఠాన్నెక్కాయి
కుర్చీదొరకెను క్రంతలుండవని కొందరు కలలేకన్నారు
- కమలము వలదని లౌకికేశ్వరుని నాలుకపై జపియిస్తారా
ఇప్పుడిదయితే ధాతకు ఎందుకు వీడ్కోలివ్వగ కదలాలి.

వెన్నుపోటుతో భారతీయతకు మచ్చలు కొందరు తెచ్చారు
ఇదెరాష్ట్రీయత కావచ్చంటూ కొందరు జబ్బలు చరిచారు
కర్మగాలి మరివంచనేశ్వరులకిప్పుడు జైజై కొడతారా
ఇప్పుడు కొడితే ధాతకుఎందుకు వీడ్కోలివ్వగ కదలాలి.



విదేశి వస్తువుగిరాకి పెంచుతు దిగుమతి ద్రోహంచేశారు
స్వదేశీయతకు అది ఆధారముసుమ్మని కొందరు పలికారు
- దేశీతగ్గెను బహుళేశ్వర అని అప్పుల ఊబిలో దిగినారు
ఇప్పుడు దిగితే ధాతకు ఎందుకు వీడ్కోలివ్వగ కదలాలి.

కరణంపంతులు దేశం పెద్దయి కండ్లు మూసుకొని ఉన్నాడు
ఇదిచాణక్యం అంటూ ఆంధ్రులు మురిసిముప్పందుంఅయినారు
- భజనపరులకూ స్కామేశ్వరయని నిత్యపూజలొనరిస్తారా
ఇప్పుడిదయితే ధాతకు ఎందుకు వీడ్కోలివ్వగ కదలాలి.

ఊరిపటేలు ఉట్టిపుణ్యానికి ఉర్వీశుండై పోయాడు
ఆలమట్టినీ ఆపుతడనుకొని అందరు నిద్దురపోయారు
- ఆదమరచి ఓనిద్రేశ్వరయను ఆయననే వరియిస్తారా !
ఇప్పుడిదయితే ధాతకు ఎందుకు వీడ్కోలివ్వగ కదలాలి.

* * *

- ఈశ్వర సంవత్సరాదికి ఒకరోజు ముందు

7-7-97



www.eTelangana.org

# మేము శరణార్థులం

(దేశ విభజన సందర్భంలో వచ్చినవారు, బాధలు పడుతున్న వారు, ఇప్పటికీ ఓటు హక్కులేని వారైన హిందువులు గాంధీ-నెహ్రూల బొమ్మలను అడుగుతున్నారు)

పల్లవి : మేము శరణార్థులం మేము శరణార్థులం
ఏబదేళ్లయ్యినా మేం కాందీశీకులం
ఓ గాంధి! ఓ నెహ్రూ మేమెచటి పౌరులం

సింధూ భూభాగాన మేము పుట్టామండి !
రావిసట్లెజ్ నదుల నీరు త్రాగామండి !
తల్వార్ల దెబ్బలకు తల్లడిల్లామండి !
మేము పుట్టిన గడ్డమమ్మాదుకోకుంటె
ఖండితాత్మయి తల్లికంటతడి పెడుతుంటె
మాగోడు ఆగష్టు పదిహేనువిన్నదా !
నడిరేయి స్వాతంత్ర్య నయనమ్ము కన్నదా !

॥మేముశరణార్థులం॥

మెతుకునిచ్చేనేల గడ్డలను వదిలాము
నీడనిచ్చిన గూడు కొంపలను వీడాము



తల్లి పోగొట్టుకొని పిల్లపోగొట్టుకొని
చేతిపనిముట్టులను వదలి ఇటకొచ్చాము
కాళ్లు చేతులులేని పంగులం కొందరం
కళ్లు కనబడకున్న అంధులం కొందరం
దేశవిభజన సర్వబాధితులమందరం
కుర్చీల తలలోకి దూరని కుజీవులం

॥మేముశరణార్థులం॥

రైలు డబ్బాలలో మాతలలు వస్తోంటే
నేల తల్లికి గుండె పుండుపడినెత్రాలుక
గుండె గుప్పిట పట్టుకొని మేము వచ్చాము
ఏదియేమైతేమి స్వర్ణభారతి కుర్చి
ఇప్పుడెక్కకపోతె మరి ఎప్పుడెక్కమని
అధికారదాహమ్ము మున్ముందుతీరదని
నడిరేయి రాజులై పడి త్రుళ్లితిరి వహ్వా !
భోగవాదము గుతిని తీర్చుకోవాలని

॥మేముశరణార్థులం॥

మా ఆస్తి పాస్తులను నిలుపుకోవాలంటె
హక్కు భుక్తమ్ముగా అనుభవించాలంటె
గడ్డాలు పెంచుకొని సున్తీలు చేసుకొని
అచ్చోటనే ఉండుమని వారుకోరారు



www.eTelangana.org

పేర్లు మారుతవంట తీర్లుమారుతవంట
మా తల్లిదండ్రులే మారిపోతారంట
జాతి మారెడు రీతి నీతి నొప్పక మేము
బ్రతుకుజీవుడ అంటు ఇటు పారివచ్చాము

॥మేముశరణార్థులం॥

నేనా బెలూచిస్థానాన కర్షకుడ
ఇచ్చోట భూమేది జీవించు భిక్షుకుడ
ఆ సింధులో నేను ఘన చిత్రకారుడను
ఈ హిందు భూస్థలిని నేవీధి రేఖకుడ
ఢాకాలోనేత పనిముట్లు గల కార్మికుడ
బ్రతుకునేతకు ఇచట పూరితోపూరకుడ
కూతకూతకు గుండె కోతలకు గురిఅయిన
గూడు వీడిన పులుగు-లో కూత వింటార !

॥మేముశరణార్థులం॥

మతవాద సామ్రాజ్య పిండారి తండాలు
మాచెల్లి మాయక్కలను చెరచి హింసిస్తే
వారలను రక్షించుశక్తి మాకివ్వమని
ఆత్మీయతను చూపి ఆయుధాలివ్వమని
ఆదుకోమాయమ్మ చేదుకోమాయమ్మ
అని ఆర్తనాదాలతో మేమువస్తోంటె
మమ్మాదుకొన్నట్టి సంఘాన్ని పడదొక్కి
గద్దెపై కులికేటి వృద్ధనేతల్లార!

॥మేముశరణార్థులం॥



ఉన్మత్త మతవాద సైతాను జృంభించి
ప్రతి హిందువును ఊచకోత కోసేస్తుంటె
దేశ విభజన చేసి ఢిల్లి గద్దెలమీద
కూచొన్న అధికార రాబందు మూకలూ !
మా కండలను తినగ కాచుకొని ఉన్నార !
మానెత్తుమరకలను నాక కూచున్నార !
అమ్మభారతి ఏకధారగా ఏడ్చినా
కన్నీటి చుక్కొకటి కార్చినారా మీరు !

॥మేముశరణార్థులం॥

మా కథలు మావ్యథలు మీకు, తగిలేదాక
తాత్సారమేచేస్తె మీరెచట ఉంటారు ?
భాషెచట ఉంటుంది ! బ్రతుకెచట ఉంటుంది
సాహిత్య సంస్కృతుల అస్తిత్వ మదియెచట ?
శాంతి సౌభాగ్యాల సమరసత ఎచ్చోట ?
చైతన్య రక్తాస్రువెండేంతవరకింక
ఊరకుంటే మీకు మిగిలేవి బొమికలే
అవ్విశస్త్రాలుగా మార్చండి - లేలెండి ! రారండి !! - 2

॥మేముశరణార్థులం॥





www.eTelangana.org

## మనిషిలా ..... ?

మింటి మంటికి దారివేస్తిమి
గగన మార్గములో చరిస్తిమి
చంద్ర బింబము దోస్తి చేస్తిమి
మనిషిలా జీవించకుంటిమి 1

వ్యాసభాసుల చదువుకుంటిమి
వాల్మీకమును వల్లె వేస్తిమి
భక్త పోతన బట్టి పడితిమి
మనిషిలా జీవించ కుంటిమి 2

దారముకు నైలానుగడితిమి
గోనె పాల్థిన్ కుట్టి వేస్తిమి
ఇనుము ప్లాస్టిక్ మిలాయిస్తిమి
మనిషిలా జీవించకుంటిమి 3

కాగితాలను కట్టిపెడితిమి
కంప్యూటర్నే కట్టుకొంటిమి
ఇదే గొప్పని విప్పిచెబితిమి
ఇలా - మనిషిలా జీవించకుంటిమి 4

చేపలా ఉదకాన ఈదితిమి
పక్షిలా గగనాన ఉరికితిమి
పాములా భూస్థలిని పారితిమి
మనిషిలా జీవించకుంటిమి 5



గడ్డపారను వదలివేస్తిమి
బుల్లుడోజరు పట్టుకొంటిమి
ప్రగతి ఇదియని చాటు కొంటిమి
మనిషిలా జీవించకుంటిమి 6

ఎడ్లబండిని వెనక పెడితిమి
ఎగురు యంత్రము నాదరిస్తిమి
పైకి బాటిది అంటుచెబితిమి
మనిషిలా జీవించకుంటిమి 7

వీధి కళలను విడిచి పెడితిమి
టీవి ఇంటర్ నెట్టు పడితిమి
పరాంకోటిది చెప్పుకొంటిమి
మనిషిలా జీవించ కుంటిమి 8

నూనేదీపం వదలిపెడితిమి
వైరుదీపం తెచ్చిపెడితిమి
సౌర శక్తిని పట్టుకొంటిమి
మనిషిలా జీవించకుంటిమి 9

కుర్చీ కొఱకై ప్రాకులాడ్తిమి
డబ్బు కొఱకై ఉఱకలేస్తిమి
సుఖము కొఱకై చిందు లేస్తిమి
మనిషిలా జీవించకుంటిమి 10





www.eTelangana.org

# చస్తారా! సింహాలవుతారా!

(భారతదేశాన్ని క్రైస్తవ దేశంగా ఈ మిలీనియంలో మారుస్తామని 'పోపు' అన్నప్పుడు చెలరేగిన భావవీచిక)

పల్లవి : అగ్ర దేశీయులం అభివృద్ధిగాములం
రెండువేలేండ్ల ఈకొలమానమునమిమ్ము
దండిగా పూజింతు మిదిపండుగను కోండి
మెండుగా మాయుగమె మీయుగమ్మనుకోండి ॥

1. ప్రాచ్యదేశీయులూ ప్రాచ్యభాషీయులు
వ్యాపార సంస్కృతిది కాదుకానేకాదు
ఇది మిలీనియ మాయ జాలమ్ము గాదు, మీ
మది వికాసమ్ముకై మేము పట్టినదారి
మీరు చిక్కిన దారి – మీరు తొక్కెడు దారి
మీరు మావలె మారగా చూపురహదారి ॥అగ్ర॥

2. కన్యామరీ గూడ్సు అమ్ముకొను క్రమ్ముకొను
గత ఆరు నెలలుగా రంగైన హంగామ
ఇది ధమాకాసేలు ఇది మజాకాపూలు
ఇది రిబేటున్నదీ రీడక్షనున్నదీ



కొనుకోని తినరండి కోరికలు తీరంగ
వినుకోండి చెవులార ! విందు మందైతేమి ॥అగ్ర॥

3. వేదయుగమెందులకు వ్యాసయుగమెందులకు
విక్రమార్కుండెవడు శాలివాహనుడెవడు
బుద్ధశంకరబసవ రామానుజుండెవడు
శ్రీ దయానందాబ్దమను పేరు ఎందులకు
కృతము త్రేతా ద్వాపరము కలీ ఎందులకు
క్రీస్తు శకమను పెద్ద కొలబద్ద ఉండంగ ॥అగ్ర॥

4. అర్థమ్ముచుట్టు ఈ విశ్వమ్ము తిరుగునని
ఆమార్క్సు చెప్పెతానర్థ శాస్త్రిగ నిలిచె
కామమ్మె లోకమని ప్రవచించె ఫ్రాయిడు
ఆరెండె మూలమ్ముగా నిలిపివస్తువుల
అందించు చున్నాము ఆనందశుభవేళ ॥అగ్ర॥

5. రెండు వేలేండ్లు మరి పూర్తికావాలంటె
ఇంక మున్నూటి పైదినములున్నాయండి
ఆకొద్ది దినములే ఎటులసరిపోతాయి



www.eTelangana.org

వెట్టి మొట్టిగ ఎంతొజుట్టుకోవాలిగద
అందుకే ఏడాది ముందుగా లేపితిమి
రండి కౌగిలిలోకి చేతులను చాపితిమి ॥అగ్ర॥

6. కోయిలలు ఎన్నెన్ని ముందు కూయుటలేదు
కోడిపిల్లలు ఎన్ని ముందు పుట్టుటలేదు
ఈ మిలీనియమింక ఒక ఏడు ఉంటేమి
మాదుభాగోతమ్ము ఎంత చెప్పగ వలెను
గొట్టె బుట్టల నెంతకూరినింపగ వలెను
కాట్లన్ని మీకొఅకె పాట్లన్ని మీకొఅకే ॥అగ్ర॥

7. మామాయ జాలంలో రష్యచైనాల్ పడెను
భారతులు మీరెంత బ్రతుకులవి ఎంతెంత
బారుల్లో త్రాగండి వీధుల్లో పొరలండి
వెయ్యేళ్ల పండుగని వేనోళ్ల అరవండి
మాకథలు చెప్పుకొని మనుషులై వెలుగండి
మా మిలీనియమందరిదియంటుచాటండి ॥అగ్ర॥



8. బీరువిస్కీపొంగి బుసబుసలు కొట్టంగ
పేరు పేరును మరిచి ప్రేమలే ఒలకంగ
మీదు గృహసంస్కృతిది వ్యాప్తమా! సుప్తమే!
మా కల్చరే విశ్వకల్చరను సంయములు
మా సహస్రాబ్దినే పాటించు ధీవరులు
మా దేశ సుందరుల వినుతించె ప్రవరులు ॥అగ్ర॥

9. మీ దేశమున నాడు బట్టకట్టేలేదు
మీదు యుగముల పేరు లెవ్వారుతలిచెదరు
జగతి తలమానికము మాయుగము మాజాతి
అందుకే అజ్ఞాన దేశాల వారికడ తేర్చంగ
విజ్ఞాన యుగములను పాదుకొల్పితిమేము
సామ్రాజ్యవాద జ్ఞానమ్ములో మునగండి ॥అగ్ర॥

10. మొదటిమిలీనియం చివరలోనే మీరు
బానిసలుగా మారి ఒకవేయి వత్సరాల్
మిముమీరు మరిచారు మమ్మనుసరించారు
మీభాష ఎందులకు భావాలు ఎందులకు ?
మా వేషభాషలను అనుసరించగరండి
మామాట వినరండి మీకు మోక్షము కలుగు ॥అగ్ర॥



www.eTelangana.org

11. అగ్ర దేశీయులను మాటలను విన్నార !
అన్నదమ్ములు ఇట్ల అంటార ఎపుడైన !
బలహీన జనములను త్రాడుపామై ఖర్చు
మేకపిల్లలు ఎపుడు కోతకే తలవంచు
సింహాలవలె మీరు ఉంటె ఇట్లంటార !
చస్తార ! చైతన్యమూర్తులై లేస్తార !

12. ఆర్ష ధార్మిక వీరవ్రతధారులై రండి !
స్వయమేవ మృగేంద్రతాయంచు నడవండి !
శ్రీరామ శ్రీకృష్ణ ఆంజనేయాదులను
ఛత్రపతి రాణా గోవిందసింగులను
ఆదర్శ వీరులుగ గ్రహియించి నిలువండి !
రాజ్యమ్ము వీర భోజ్యమ్మంచు తెలియండి !

* * *



## రావోయి విక్రమా !

రావోయి విక్రమా ! ఉగ్ర సౌజన్యమా !
రావోయి విక్రమా భరతజన సత్త్వమా !

1. అక్రమాసురులిచట అంధకారము పులిమి
వక్రమార్గమ్ములో వసుధాతలము కలిమి
విక్రమా ! చూడోయి విందు చేస్తున్నారు
చక్రధారుల కొఱకు జనులు చూస్తున్నారు.

2. అలనాడు గజరాజు అరుపువిన్నావు గద
అన్నవై ద్రౌపదిని ఆదుకొంటివి గద
హ్లాదముగ ప్రహ్లాదు నరసి కొన్నావు గద
అమ్మ భారతి విక్రమా ! రమ్ము పిలిచె గద !

3. 'ప్రమ' ఆది అనుకొంటెవిభ్రమము మిగిలినది
'ప్రమాథీ' అనుకొంటె వ్యత్యస్తమయ్యినది
ప్రమాదములు చూపి పరుగులను తీసినది
ప్రమప్రేమమున విక్రమా ! జనత పిలిచినది


www.eTelangana.org

4. అక్రమముగా వచ్చు చొరబాటుదారులను
అక్రమముగా గద్దె లెక్కు దుర్మార్గులను
అక్రమముగా ఆర్జనముసేయు హీనులను
విక్రమా! నిలబెట్టి విద్య చూపింపుమా !

5. దేశభద్రత కొఱకు దేబరింపులు వలదు
కోశ స్థిరత కొఱకు కోయంటు పిలవద్దు
విష్ణువిక్రమ భారతీయాత్మ జృంభింప
విశ్వభారతి కనుల చారికలు తొలగింప ॥

**రావోయి విక్రమా ! ఉగ్ర సౌజన్యమా !**
**రావోయి విక్రమా భరతజన సత్త్వమా !**





# వ్యయం అవ్యయం నిమిత్తం

వ్యయ మేమి చేయగా వచ్చితివి ఇచ్చుటకు
వ్యయనామవత్సరమ ! వందనం ముచ్చుటకు ॥
వ్యయమంటే భయమేమి – వ్యయమంటే అవ్యయం
వ్యయమంటే బహు వృద్ధి – అందుకే అవ్యయం ॥

1. మాభూమి వ్యయమగుట మాకునచ్చని మాట
మా ప్రజలు కరుసగుట మేముమెచ్చని 'గాట'
క్రొవ్వొత్తిలా మేము నీరైన భయపడము
దివ్వెలా వెలుగొంది కాంతివెదజల్లెదము

2. మాధర్మమవ్యయము మా సంస్కృతవ్యయము
మాతత్త్వమవ్యయము మా జ్ఞాన మవ్యయము
మాయ తొలగిన వేళ మా సత్య మవ్యయము
ఆత్మాను సంధాన మౌ బ్రహ్మ మవ్యయము

3. భౌతికమ్మగు దేహ మిది వ్యయమ్మయి పోవు
వ్యయమంటే పరిణామ మగు, కాదు నాశనము



www.eTelangana.org

మబ్బోలె పరిణామ ముందునది ద్రవ్యమ్ము
దాగి చేతన నిచ్చు శాశ్వతము దైవమ్ము.

4. మనము శ్రమజీవులము భవ్య భావుకులము
శ్రమశక్తిలో నిలుచు స్థిరకర్మయోగులము
భావనమ్మున నిల్చు నిష్కామ జ్ఞానులము
భక్తిధ్యానమ్ములో విశ్వ శ్రేయస్కులము

5. నేను చేసిన కృషికి నాచేత ధనముంటె
ఆధనము నిరుపేద వైద్యమ్ముకై వ్యయము
తల్లి దండ్రులు లేని పిల్లలకు అది వ్యయము
ధనమెందుకొఅకంటె ఇందుకొఅకే వ్యయము

6. నాశ్రద్ధ కీలోక మర్థమయ్యినదింత
ఆ ఎఱుక అజ్ఞాన మర్పింతునందరికి
అక్షరాలే రాని నా అమాయిక ప్రజకు
ఆ - జ్ఞానమును వ్యయము చేయగా జీవింతు



7. నాకున్న అధికారమది ఎంతదయ్యినా
అద్ది ఎవ్వరి సేవ చేయగా వ్యయమౌనొ
ఆకష్ట జీవులకు ఆమూగజీవులకు
అర్పింతు అర్చింతు జన్మధన్యమ్మెంతు.

8. బ్రహ్మండ భాండాల సుస్థిరమ్మౌ శక్తి
పిండాండమున కూడ కలదంచు తెలిసితి
ఈ శక్తి బలహీన జీవులకు వ్యయమైతె
ఈవ్యయము అవ్యయమ్మని నేను భావింతు ॥

॥వ్యయమంటె భయమేమి వ్యయమంటె అవ్యయం
వ్యయమంటె బహువృద్ధి అందుకే అవ్యయం ॥




www.eTelangana.org

# శ్రీ గురూజీయం

(శ్రీ గురూజి శతజయంతి సందర్భంగా)

నిద్రలేచి జూలు దులిపి నిటారుగా నిలవండి !
భద్రంగా దీవించే భరతధాత్రి నేలుకోండి !
నిరాశతో మూల్గువారు శ్రీ గురూజి చదవండి !
పరాకువీడి జాతీయత శంఖ మొత్త రారండీ !

హిందువులది ఒకజాతి ఒక సంస్కృతి ఒక ధర్మం
బంధు భావమును పెంచి సంఘటన చేయండి !
జాతీయత సంఘటనం మానవ శ్రేయస్సుకొరకు
జగద్ధితం కూడ జాతిఏకత సాధించునండి ।     ॥నిద్ర॥

సర్వమానవాళి సుఖము సంతోషము ఆరోగ్యము
సర్వప్రాణిదుఖరహిత జీవితమాశిస్తి మండి !
శాంతియు సహజీవనమును సామరస్య సౌభాగ్యము
జగ జగాన యుగ యుగాల చాటించిన వారమండి ॥నిద్ర॥

స్వార్థ ప్రయోజనాల తోటి పనిచేస్తే సంఘర్షణ
జాతిహితం కోరి జనం కలిసినదవ సంక్రమణం
సంఘర్షణ వల్ల దేశ సమైక్యతకు ముప్పు ముప్పు
సంక్రమణం సంక్షేమం దేశ హితం సంఘటనం    ॥నిద్ర॥

మన ఆత్మలవలెనె సర్వ భూతాత్మలు తెలియండి !
దర్శనమ్మెకాదు ధర్మమార్గమ్మున నడవండి !
ప్రాంతీయత పుష్పాలలో భారతాత్మ దారమండి !
సామరస్య సమానత్వ సౌజన్యం శక్తండి !     ॥నిద్ర॥

* * *



# వివేక గీత !

(స్వామి వివేకానందుల భావాలు)

1. మన శక్తికి వంగు దేహం
దేహ స్థితులకు వంగు చిత్తం
మనసు దేహం రెండు మనసుకు
ఎపుడు వశమౌ అపుడె యోగం

2. నీకు నీవై పొందు అనుభవ
మదేసత్యం రాజయోగం
స్వప్నములు బోధనలు కావివి
గోచరాను భవమైన యోగం

3. భోగలాలస ఉగ్రతపమును
నిరాహారత దేహ హింసను
యోగ సాధనలోని యోగులు
వదలవలెనండీ!

4. యోగమైనా శాస్త్రమైనా
ఒకరి అనుభవ జన్యమేకద!
అదే అనుభవ మీవు పొందిన
నమ్ముకో ! లేకుంటెనమ్మకు



www.eTelangana.org

5. ఏకమైనను అనేకంగా
అనేకమ్మును ఏకవిధిగా
దర్శనమ్మున గ్రహించడమే
శాస్త్ర పరమావధిగా

6. మిమ్ము బలహీనమ్ము చేసే
దేదియైనా విసర్జించుడు
జీవయాత్రలబాటసారికి
బలమెసరియగుత్రోవ చూపును.

7. అడవి మనిషియు నాగరికముగ
అద్భుతంగా ఎదగవచ్చును
నాగరికుడును అడవి మనిషిగ
బాగుగా దిగజార వచ్చును.

8. దేవుడెక్కడా స్వర్గమందున
ఉన్నాడంటే తెలివితక్కువ
గుండె గుడిలో ఉన్నా రన్నది
హిందూ భావనగా.

9. మాయ తెర తొలిగాక జీవుడు
దేవు డేమిటొ అర్థమవ్వును
ఎండమావులు తెలిసిపోతే
మోస పోవుట లేదుగా !

10. ఆస్తికుండను కపట వేషం
వేసేకన్నా నాస్తికునిగా
ఉంటె క్షేమం; మతం వేదాం
తమ్ముసత్పురుషులను చేయును.



## గీతా సారం !

జన్మయెత్తిన ప్రాణి మరణమ్ము తథ్యమ్ము
చచ్చిపోయిన ప్రాణి జననమ్ము సత్యమ్ము
మరణమన్నది దేహమునకున్న దెఱుగండి !
ఆత్మ శాశ్వతమన్న శాస్త్రమ్ము తెలియండి !
పుట్టడం చావడం చావడం పుట్టడం
ఈ ప్రక్రియేసాగు చక్రమగు జీవనం
చావు పుట్టుకలంటు చింతించపనిలేదు.

నీ ధర్మకర్మమ్ము నిత్యమ్ము చేయాలి
కర్మఫల మందరిది శ్రమజీవిదే కాదు
తనకు చెందాలంటు కర్మ చేయగరాదు
నీ ధర్మకర్మములు వదలిపెట్టగరాదు
పరధర్మకర్మముల పట్టుకొని పోరాదు
స్వీయధర్మమె సకల శ్రేష్ఠమని చేయాలి.



www.eTelangana.org

సర్వప్రాణులు నీతో సమముగా భావించు

నీలోను వాటిలో ఒకెయాత్మ దర్శించు

సుఖదుఖ ద్వంద్వాలు సమముగా ఎదనిలుపు

మానసిక శాంతితో జీవించ సాధించు

కష్టాలు – సౌఖ్యాలు నిన్ను కదలించవిక

శ్రేష్ఠుడవు నీవైతె నిన్ననుసరిస్తారు.

మోక్షమార్గమ్మునకు ఆరుగురు శత్రువులు

ఎవరి గుణముల కర్మలను వారు చేస్తారు

కర్మానుసారమై ఫలితాలు వస్తాయి.

ఆత్మదర్శన జ్ఞాని కర్మలను చిక్కడు.

వదలుకో అన్నిటిని నన్ను శరణని నమ్ము.





www.eTelangana.org